# పండిత పాత్రికేయులు-బహుభాషాకోవిదులు





# తిరుమల రామచంద్ర

(17.6.1913 - 12.10.1997)

## శతజయంతి సంస్మృతి




ప్రచురణ:
**వయోధిక పాత్రికేయ సంఘం**

# రామచంద్ర ఛాయా చిత్రాలు

భార్య అనంతలక్ష్మితో రామచంద్ర

అంబేద్కర్ సార్వాత్రిక విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేట్ పురస్కారం

# పండిత పాత్రికేయులు-బహుభాషాకోవిదులు







# తిరుమల రామచంద్ర

(17.6.1913 - 12.10.1997)

## శతజయంతి సంస్మృతి




ప్రచురణ:
వయోధిక పాత్రికేయ సంఘం

# Tiramuala Ramachandra-Satajayanthi Samsmrithi

**Published by:** Veteran Journalists' Association

**Publication No.:** 07

**First Edition:** June, 2013

**Price:** ₹20/-

**For Copies:** Veteran Journalists' Association
Plot No. 24, Journalists' Colony, Road No. 3,
Banjara Hills, Hyderabad - 34
and
All leading Book sellers

**Design:** **efforts design**
www.efforts.co.in

**Printed at:** **Sai Likhita Printers**
Khairatabad, Hyderabad.

# అలుపెరుగని సాహితీ కృషీవలుడు

పండితుల సొత్తుగా ఉన్న సాహిత్యం ప్రజాపరం కావాలి, అవుతుంది అన్నారు  కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు. ఆ మాటను నిజంచేయడానికి యావజ్జీవం పాటుపడ్డారు తిరుమల రామచంద్ర. సరళమైన, సలక్షణమైన, సహజసుందరమైన తెలుగు భాషకు పట్టంకట్టి, భావితరాలకు ముఖ్యంగా పత్రికా రచయితలకు మార్గదర్శకులయ్యారు. తిరుమల రామచంద్ర స్వయాన వరిష్ఠ పత్రికారచయిత అవడమేగాక జగమెరిగిన పండితుడు, పరిశోధకుడు, విమర్శకుడు, బహుభాషావేత్త, బహుగ్రంథకర్త. పత్రికా రచయితగానే తమ భాషాసేవను కొనసాగించారు. బిరుదులు, అవార్డులు, గౌరవ డాక్టరేట్లు ఎన్ని వరించినా కలకత్తా సర్వభాషా పత్రకార్ సమ్మేళనంలో స్వీకరించిన పత్రకార్ శిరోమణి అనే బిరుదొక్కటే తమ పేరుముందురాసుకోడానికి ఇష్టపడేవారు. భాషాసేవకుడుగానే చలామణి అయ్యేవారు.

ఆ మహానుభావుని శతజయంతి సంవత్సరమిది. ఆయన లేఖినీ చిత్రాలు ఎన్నెన్నో అందుబాటులో ఉన్నాయి. ఇంకా ఎన్నెన్నో అముద్రిత రచనలుగా మిగిలి ఉన్నాయి. శతజయంతి సందర్భంగా ఆయనకు అక్షర నివాళి సమర్పించడం సముచితంగా ఉంటుందని మా వయోధిక పాత్రికేయ సంఘం సంభావించింది. చంద్రునికో నూలుపోగుగా గతంలో కొందరు ప్రముఖులు ఆయన గురించి వ్రాసిన వ్యాసాలను సేకరించి ఈ చిరు పుస్తకాన్ని ప్రచురించింది. ఈ వరుసలోనే ముమ్ముందు మా శక్తికొలది మరిన్ని ప్రచురణలు తెచ్చి ఆయనకు ప్రియమైన భాషాసేవను కొనసాగించదలచింది. రామచంద్ర సాహిత్యకృషిమీద ఒక విద్వద్గోష్ఠిని ఏర్పాటుచేసే అలోచన కూడా వుంది.

పత్రికా రచయితలకు ఉపయుక్తమైన పుస్తకాలను, వారు తమ వృత్తిపరమైన పరిజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి ఉపకరించే రచనలను అందుబాటులోకి తేవాలన్నది మా లక్ష్యాలలో ఒకటి. వయోధికులమైనందున మాట సాయం బాగానే చేయగలం. కాని పుస్తక ప్రచురణ ఆషామాషీ వ్యవహారంకాదు. అయినా వదాన్యులైన భాషాప్రేమికుల అండదండలతో ఇప్పటికి ఆరు పుస్తకాలను తేగలిగాము. ఈ పరంపరలోనే తిరుమల రామచంద్ర పలుకుబడి అనే శీర్షికలో రాసిన భాషావిషయాలను గ్రంథస్థం చేయదలచాము. అదొక పాఠ్య గ్రంథం వంటిది. భాషా రంగంలో పనేచేసేవారికి అవశ్య పఠనీయ గ్రంథం కూడా.

భాష నిత్య ప్రవాహిని. కనుక కొంత కాలుష్యానికి లోనవుతుంటుంది. అశ్రద్ధ వల్ల, అజ్ఞానం వల్ల మితిమీరుతుంటుంది. శబ్ద స్వరూపాన్ని, భాష స్వచ్ఛతను కాపాడటానికి రామచంద్రతో సహా పత్రికా ప్రముఖులు పట్టుదలతో కృషిచేశారు. శబ్ద సాగరాన్ని సృష్టించారు. అవసరమైన వారు ఎంతైనా తోడుకోవచ్చు. వాడుకోవచ్చు.

రాష్ట్ర ప్రభుత్వం ఈ సంవత్సరాన్ని తెలుగు భాషా సాంస్కృతిక వికాస సంవత్సరంగా ప్రకటించింది. తిరుమల రామచంద్ర శతజయంతి దీనిలో కలిసివచ్చింది. భాషాభివృద్ధికి తోడ్పడటం ప్రభుత్వ లక్ష్యాలలో ఒకటి గనుక అధికార భాషా సంఘమో, తెలుగు విశ్వవిద్యాలయమో, తెలుగు అకాడమీయో రామచంద్ర వంటి అలుపెరుగని సాహితీ కృషీవలుల రచనలన్నిటినీ సమగ్రసాహిత్య సంపుటాలుగా ప్రచురిస్తే తెలుగు భాషకు ఎనలేని సేవ చేసినట్టవుతుంది. వారి ప్రకటిత లక్ష్యమూ నెరవేరుతుంది.

**డా॥ జి.యస్. వరదాచారి**

అధ్యక్షులు.

వయోధిక పాత్రికేయ సంఘం

# అఖండ పండితుడు రామచంద్ర

-మద్దాలి సత్యనారాయణ శర్మ

తిరుమల రామచంద్రను గురించి ఒక్కమాటలో చెప్పాలంటే అఖండ పండితుడు. విజ్ఞాన సంబంధ వివిధ విషయాలలో తిరుగులేని పాండిత్యం ఆయనది. అయితే ఆయన కృషి ఫలితం - రచనలు - సామాన్యులు అందుకోలేనివిగా ఉండడం వల్ల విజ్ఞులు, విద్వాంసులే ఆయన ఘనతను ఎక్కువగా గుర్తించగలిగారు.

రామచంద్ర "పేరు పోకడ" ఆయన ప్రయాగ కోదండ రామశర్మతో కలసి ప్రచురించిన " పరిశోధన" ద్వారానే తొలుత తెలియ వచ్చింది. డెబ్బయి ఎండ్లనాటి ఆ పత్రిక ప్రచురించిన రచనలు నేటికీ ప్రామాణ్యాలే అనటం అతిశయోక్తి కాదు. అయితే "లిపి-పుట్టు పూర్వోత్తరాలు", "నుడి-నా నుడి", "హంపి నుంచి హరప్పా దాకా" మాత్రమే పది మంది దృష్టినాకర్షించాయి.

రామచంద్రతో ముఖ పరిచయం 1944లో హైదరాబాద్ నాంపల్లిలో కురుగంటి సీతారామయ్య గారింట జరిగింది. ఆ ఇల్లు అతిథి అభ్యాగతులకు ఆశ్రమంగా, ఆశ్రయంగా ఉండేది.

ఆతర్వాత1945లో ఒకరోజున తూలికా భూషణ్ (బుద్ధవరపు చిన కామరాజు), రామచంద్ర చెన్నపట్నంలో మా ఇంటి ముందు ప్రత్యక్షమైనారు. ఉద్యోగార్థులం, ఆసరా కావాలన్నారు. వారి ఆ చొరవ క్రమంగా మైత్రీ భావంతో మెలగటానికి దారితీసింది.

రామచంద్ర ఆంధ్రప్రభలో, చిన కామరాజు ఆంధ్రపత్రికలో చేరగలిగారు. ఆంధ్రపత్రికకు శంభుప్రసాద్ సంపాదకులు. రామచంద్రకి ఉపసంపాదక పదవి కాక ఆయన యోగ్యతకు తగిన "భారతి" మాసపత్రిక సహాయ సంపాదక పదవి ఇచ్చారు. ఆయన తన ప్రజ్ఞాప్రాభవాలు ప్రదర్శించుకునే సావకాశం లభించింది.

ఆ విధంగా ఈ రచయితకు ఆంధ్రపత్రికలో రామచంద్రతో సహోద్యోగి యోగం ప్రాప్తించింది. సన్నిహితంగా అర్థంచేసుకొనే అవకాశం లభించింది. రామచంద్ర సముత్సాహంతో "భారతి" నిర్వహణలో పాల్గొని సాహితీపరుల సంకీర్తనలు సమృద్ధిగా సంపాదించుకోగలిగారు. ఆయన నిర్మొహమాట వైఖరి కొందరు సాహితీ పరులును నొప్పించి ఉండవచ్చు. శంభుప్రసాద్ గారికి రామచంద్ర ధోరణి బాగా నచ్చింది కూడాను. ఎవరు ఏ ఫిర్యాదుచేసినా ఖాతరు చేసే రకం కాదు ఆయన.

అయినా ఒకరోజు ఉన్నట్టుండి రామచంద్ర "భారతి" నుంచి మాయమైనారు. సామాన్యంగా, సజావుగా సాగేదైతే అది రామచంద్ర జీవిత సరళి ఎట్లా అవుతుంది. "హంపి నుంచి హరప్పా దాకా" అని రామచంద్ర రాసిన అద్భుత ఆత్మకథే అందుకు నిదర్శనం.

అంతటి అఖండ పండితుడు, గొప్పరచయిత అయిన రామచంద్ర శతజయంతి నిర్వహణకు విఘ్నలు పూనుకొనడం వినుతించ దగ్గది. ఆయన కృతులు గ్రంథాలయాలలోనైనా లభించేటట్లు చేయటానికి పెద్దలు పూనుకోవడం అవసరం.

* * *

# పరిశోధన పారంగతుడు తిరుమల రామచంద్ర

– టి. ఉడయవర్లు

సుప్రసిద్ధ పత్రికా రచయిత, పండితుడు, పరిశోధకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు తిరుమల రామచంద్ర. సంస్కృతం, ప్రాకృతం, హిందీ, కన్నడం, తమిళం, ఆంగ్లం, ఆంధ్రభాషలలో అనితరసాధ్యమైన పాండిత్యం, పరిశోధనా పాటవంతో వారు చేసిన రచనలు – తెలుగు భాష, సాహిత్య ప్రియులకు కరదీపికలు. సంస్కృతం, ప్రాకృతం, కన్నడం, తమిళం, హిందీ, ఇంగ్లీషు భాషలలోని అనేక అపురూప రచనలను తెలుగులో అనుసృష్టి చేశారు. శతాధిక రచనలు వారు చేసినప్పటికీ, ఇప్పటికీ దాదాపు పాతిక దాకా మాత్రమే పుస్తకరూపంలో వచ్చాయి. చీకటి కోణాల్లో దాగున్న తెలుగుకు తన పరిశోధనల ద్వారా వెలుగునిచ్చిన తిరుమల రామచంద్ర రచనలు తిరిగి తెలుగువారికి అందకుండా అంధకారంలో మ్రగ్గడం క్షంతవ్యం కాదు.

తిరుమల రామచంద్ర వ్రాసిన 'మనలిపి–పుట్టు పూర్వోత్తరాలు' అయినా, 'నుడి–నానుడి' అయినా, ' సాహితీ సుగతుని స్వగతం' అయినా, 'మరుపురాని మనీషులు' అయినా, 'గాథాసప్తశతి'లో తెలుగు పదాలు అయినా–ఏ ఒక్కటి అమెరికాలాంటి పశ్చిమదేశంలో రచించి ఉంటే పరిశోధనాత్మక రచనలకుగాను జర్నలిస్టులకిచ్చే "పులిట్జర్" అవార్డు ఎప్పుడో వచ్చి ఉండేది. ఆయన చివరి రోజులలో వ్రాసిన ఆత్మకథాత్మక రచన "హంపీ నుంచి హరప్పాదాకా" జ్ఞానపీఠ్ అవార్డు రాదగినది. తెలుగులో ఇంత చక్కని, చిక్కని, అక్కున చేర్చుకోదగిన జీవిత చరిత్ర మరొకటి రాలేదు.

వీరు 'పరిశోధన' పత్రికను అడ్వర్‌టైజ్‌మెంట్ లేకుండా నడపడం రికార్డు.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన రెండు నెలల్లో వెలువడిన అపూర్వ గ్రంథం "మనలిపి-పుట్టుపూర్వోత్తరాలు". ఎన్నో కొంగ్రొత్త అంశాలు చెప్పిన ఈ గ్రంథం భారతీయ భాషలలో సమగ్రమైనది. ఇంతవరకు ఇలాటి గ్రంథం రాలేదు.

అలాగే భాషాశాస్త్రాన్ని మానవజాతి శాస్త్ర, సాంఘిక శాస్త్ర, చరిత్రాదులతో సమన్వయించి రచించిన మరో అపూర్వగ్రంథం - 'నుడి-నానుడి'. వివిధ దృకోణాలతో వ్రాసిన ఇలాంటి గ్రంథం కూడా మరొకటి లేదు.

పాకృత-తెలుగు సాహిత్యాలకు రెండువేల సంవత్సరాలకు పైగా సంబంధం ఉందంటారే తప్ప - వివరణాత్మకంగా వ్రాసినవారు లేరు. ఈనేపథ్యంలో "గాథసప్తశతి"లో తెలుగు పదాలు వెలికితీసి పుస్తకరూపం ఇచ్చారు. గాథా సప్తశతిని కాళిదాసు అనుకరించాడని ఈ గ్రంథంలో తిరుమల రామచంద్ర సిద్ధాంతీకరించి చెప్పారు.

'సాహితీ సుగతుని స్వగతం", "మరుపురాని మనీషులు" మౌలిక వ్యాస సంపుటాలు. ఈ గ్రంథాలు ఆరోజుల్లో నాలాంటి సాహితీ ప్రియులకు, యువజర్నలిస్టులకు, విద్యార్థులకు స్ఫూర్తిగ్రంథాలు.

ఇంతటి పరిశోధనా పారంగతుడు తిరుమల రామచంద్ర ప్రమాదీచనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ చతుర్ధశి జ్యేష్ఠ నక్షత్రంలో అంటే సరైన తేదీ 1913 జూన్ 17వ తేదీన జానకమ్మ - శేషాచార్య దంపతులకు జన్మించారు.

రాష్ట్ర ప్రభుత్వం తెలుగుభాష, సాంస్కృతిక వికాస సంవత్సరంగా ప్రకటించిన ఈయేడాదే తెలుగుభాషా సేవకుడుగా తనకుతానే ఎంతో గర్వంగా బతుకున్నంతకాలం చెప్పుకున్న తిరుమల రామచంద్ర శతజయంతి సంవత్సరం రావడం యాదృచ్ఛికమైనా, ప్రభుత్వం దానికి సంబంధించిన భాషా, సాంస్కృతిక సంబంధిత సంస్థలు శ్రద్ధ వహించి ఘనంగా నిర్వహించవలసిన అవసరం ఎంతగానో ఉంది.

ఇంతవరకు పుస్తకరూపం లోకిరాని వారి రచనలు సేకరించి, వరుసగా ప్రచురించవలసిన తరుణమిది.

1997 అక్టోబరు 12వ తేదీన కన్నుమూసిన తిరుమల రామచంద్ర ఎనభైనాలుగేండ్ల వయస్సులోను అప్పుడు జర్నలిస్టుగా చురుకుగా పనిచేస్తున్న నాలాంటి వారితో కలిసి ఎన్నో సభల్లో పాల్గొన్నారు. మరెన్నోసార్లు తమ అనుభవాలు, జీవిత విశేషాలు, భాషా సాహిత్య విషయాల పరిశోధనలో అనుసరించిన పద్ధతులు చెప్పారు. వయస్సురీత్యానే కాకుండా, పాండిత్యపరంగా ఎలాంటి భేషజంలేకుండా మనసువిప్పి మాట్లాడే స్వభావం కలిగిన తిరుమల రామచంద్ర జీవిత, సాహిత్య సేవలను దిఙ్మాత్రంగా ఆవిష్కరించే ప్రయత్నమే ఈ వ్యాసం.

నిజానికి తిరుమల రామచంద్ర ఒక విచిత్రమైన వ్యక్తి, వైరుధ్యాలపుట్ట. ఇంతలో కోపం వచ్చేది, అంతలో దయ చూపేవాడు. కోపంలో ఒళ్ళు తెలిసేది కాదు. దయతో మనస్సు తెలిసేదికాదు. పట్టుదలతో ఏదైనా ప్రారంభించేవారు. మధ్యలో అకారణంగా వదిలివేసేవారు. తర్వాత చచ్చిచెడి చాయంగల విన్నపాలుగా పని ముగించేవారు. స్పష్ట భాషణం వల్ల చాలా నష్టపోయారు. ఎవరితోనన్నా పట్టింపు వస్తే ఇక మొగం చూడగూడదన్నంత తెగువ. అంతలో పశ్చాత్తాపం, అనుకంప. ఆయనకోపం చూచి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "వీరభద్రాచార్యులు" అని సంబంధించేవారట. వారికి తిక్క ఎంత ఉన్నా అందరినీ ప్రేమతో మర్యాదగా పలకరించేవారు. ప్రేమను భగవత్స్వరూపంగా భావించేవారు. వారి దృష్టిలో ప్రేమ భక్తికి అంగం.

వారికి వేదాలమీద, సంస్కృతి మీద గొప్ప గౌరవం ఉండేది. వేదాలు అనేక కాలాల, అనేక దేశాల, అనేక సంఘాల, అనేక గణాల, అనేకానేక జాతుల చరిత్ర అని నమ్మేవారు. భాష విషయంలో ప్రాకృతం విశ్వవ్యాప్తంగా ఉండేదని, దాని సంస్కరణమే వేద సంస్కృతమని వారు విశ్వసించేవారు. ప్రాకృతం, తెలుగు తనకు సమానమైన తల్లులు అనేవారు. కులాలు అంతరిస్తాయిగాని మతం, మానవతకు సంబంధించింది గనుక మనుతుందని ఉపనిషత్కాల సంస్కృతి ఏర్పడుతుందని వారు నమ్మేవారు.

వారి అలవాట్లు కూడా విచిత్రంగా ఉండేవి. నడక వారికి ఇష్టం. చిన్నప్పుడు యోగాసనాలు వేసేవారు. దండాలు, బస్కీలు, ప్యార్లర్‌బార్‌పై పులప్స్ తీసేవారు. ప్రయాణాలు బాగా ఇష్టం. మద్రాసు ఓరియంట్ లైబ్రరీలో కాపీయిస్టుగా ఉన్నప్పుడు గబగబా పాత పుస్తకాలు నకలు చేసి, ముప్పై రూపాయలు గిట్టుతుందని తోస్తే, పని ఆపివేసి, పర్యటనలు సాగించేవారు.

ఒకసారి రామచంద్ర హరిహర నుంచి బస్సులో బొంబాయి, సూరత్‌ల మీదుగా హరప్పా మొహంజోదడోల వరకు వెళ్ళారట. దాని ప్రభావమే వారు "హంపీనుంచి హరప్పాదాకా" శీర్షికన వారు ఆత్మకథాత్మక రచనను పాఠకులను మంత్రముగ్ధులను చేసే విధంగా అందించడం.

వారి జీవితంలో వింత ఘటనలు ఎన్నో సంభవించాయి. చిన్ననాడు వారి తాతగారితో ఒకటి రెండు సార్లు సంచారం వెళ్ళారట. ఒకసారి దారిలో పెద్దపులి పడుకుని ఉందట. వారి తాతగారు బండి ఎడ్లను, వెనకవచ్చే బండ్ల ఎడ్లను నొగలు విప్పి వదిలారు. అవి అర్థచంద్రాకారంగా వ్యూహం పన్నికొమ్ములు గురిచేసి నిలబడ్డాయట. ఇంతలో కాగడాలు వెలిగించారట. పులి గంట, రెండు గంటలు అలాగే వేచి ఉండి, ఇక ప్రయోజనం లేదని చల్లగా జారుకుందట.

మరొకసారి వారు రామనవమి ఉత్సవం తర్వాత బండ్లలో హంపీ నుంచి హేమకూటం ఎక్కి వస్తుంటే చిరుతపులి బండి క్రింద దూరి ఎడ్లను వెనకవాటుగా దెబ్బతీద్దామనుకుందట. వారి పినతండ్రి మంచి గురికాడు. అయితే తుపాకి గాలిలో పేల్చాడట. ఆ శబ్దానికి అది పారిపోయిందట. అలాగే హరిగోలుపై పయనించి ప్రమాదం అంచుకుపోవడం లాంటి సంగతులెన్నో వారి ఆత్మకథలో అందంగా చెప్పారు.

మిఠాయిలంటే మహాప్రీతి రామచంద్రకు, ఇంట్లో తీపి పదార్థాలు లేకపోతే బెల్లం ముక్కయినా నమలడం ఆయనకు అలవాటు. చిన్ననాడు ఏదో అల్లరి చేస్తే వారి తల్లి రామచంద్రను ఉగ్రాణం గదిలో వేసి తాళం వేసిందట. అప్పుడు ఆయన

లోపల బెల్లం కుండ మూతతీసి ఐదారు సేర్లు బెల్లం దాకా తిని మత్తుతో పడుకున్నట్టు, ఏమౌతుందోనని తర్వాత ఇంటిల్లిపాదీ బాధపడ్డట్టు కథలాగా చెప్పవారు. కాని తనకు ఏమి కాలేదని నవ్వేవారు.

ఈ వయస్సులో తన ఎనభై నాలుగేండ్ల ప్రాయంలోను నడక విడువలనని, నడకలో మంచి ఆలోచనలు వస్తాయని, బస్సు కుదుపులకు మెదడులో కదలిక ఏర్పడినట్లయి కొత్తగా ఏవో తోస్తాయనేవారు. తరచుగా తనకు కలలు కూడా వస్తాయని చెప్పేవారు. వాటిలోను భాష, తక్కిన సమస్యల పరిష్కారం కనిపిస్తాయని, వెంటనే లేచి నోట్‌పుస్తకంలోగాని, చిత్తుకాగితంపైగాని దాన్ని గుర్తు తీసుకుంటాను అనేవారు.

వారి వ్రాత పద్ధతి విచిత్రంగా ఉండేది. ఒకేమారు మూడు నాలుగు ప్రారంభించేవారు. అరకొరగా వదలివేసేవారు. కొంతకాలం తర్వాత చివరి నుంచి ప్రారంభించి ముగించేవారు. పుస్తకం చదవడంలో కూడా వారి పద్ధతి అంతే. మొదటి పుటలు రెండు మూడు చదివి చివరి అధ్యాయం నుంచి ప్రారంభించి పూర్తి చేసేవారు. పేపరు చదవడమైనా అంతే.

ఇంట్లో ఏదీ సరిగా అమర్చుకుని పెట్టుకునే అలవాటులేదు. కాగితాలన్నీ చిందరవందరగా వేసుకునేవారు. ఏదన్నా కావలసివస్తే, అన్నీ వెదకడం "ఏం నాన్నా, అన్నీ కోడిలాగా కెలుక్కుంటూ అవస్థ పడతారు. సరిగ్గా సర్దినా పాడుచేస్తారు" అని పిల్లలంటే – మరి అన్వేషణ, పరిశోధన అంటే ఏమిటి? అని నవ్వేసేవారట.

ఏ రచన చేయలన్నా ఆరంభం పెద్ద అవస్థగా ఉంటుందని చెప్పేవారు. వ్రాత ప్రారంభిస్తే మొదట్లో ఒక పంక్తి వ్రాయడం, చింపడం – ఇలా పెద్ద కుప్ప పేరుకుపోయేది. రాత్రుల్లో ఎక్కువగా వ్రాయడం వారికి అలవాటు. ఉదయం వారి శ్రీమతి అనంతలక్ష్మి "ఏం రాతో, ఏం మోతో!" అని విసుక్కుని ఆ కాగితాలకుప్ప ఊడ్చేసేదట. అయితే ఏది వ్రాసినా ఒకేమారు వ్రాసేవారు. అదే చిత్తు, అదేసాపు. పత్రికలలో పనిచేయడం వల్ల వచ్చిన అలవాటు అది.

వారి నాన్నగారి పేరుతో ప్రాకృతానికి పదివేల రూపాయల పురస్కారం పెట్టాలని సంకల్పించారు. దానికోసం ఆ వయస్సులోను ఉద్యోగం చేశారు. రెండేండ్ల కాలంలో ఐదారు వ్యాస సంకలనాలు ప్రచురించారు. రెండేండ్ల జీతం 72 వేలు వాటిపై పెట్టారు. పుస్తకాలు అమ్ముడుపోవని వారికీ తెలుసు. అయితే నిదానంగా పోతాయి. ఈ విషయంలో వారిదొక సిద్ధాంతం ఉంది. దాన్ని రచయితలు ఎవ్వరైనా ఆచరించవచ్చు.

ఒక తండ్రికి నలుగురు కొడుకులు ఉన్నారనుకోండి. వారిలో ఒకడు ఏమీ సంపాదించకపోయినా, తండ్రి అతనికి తిండి పెట్టకుండా ఉండడు గదా? తరిమివేయడుగదా! అలాగే ఒక పుస్తకం అమ్ముడుపోక పోయినా, ప్రచురించామన్న సంతృప్తి ఉంటుంది కదా? అనేవారు.

తిరుమల రామచంద్ర నడిపిన శీర్షికలలో మరుపురాని మనీషులు, నుడి-నానుడి (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక) తెలుగు వెలుగులు (ఆంధ్ర సచిత్ర వారపత్రిక) సాహితీ సుగతుని స్వగతం (భారతి) ఆయనకు ఎనలేని కీర్తిని, తెలుగుకు అపురూప సాహిత్య సంపదను ఒనగూర్చాయి. ఇవి కాకుండా వారు మనవి మాటలు (భారతి), చరిత్ర కెక్కని చరితార్థులు (పరిశోధన), తెలుగుతల్లి, మాటలకథ, పదసంపద, సంస్కృతి సంప్రదాయం (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక), మాండలికాలు, పలుకుబడి, హైదరాబాద్ లేఖ (ఆంధ్రప్రభ), హైదరాబాద్ నోట్‌బుక్ (ఆంధ్రపత్రిక), రాజధాని విశేషాలు (ఆంధ్రప్రదేశ్), ఇదీమన రాజధాని (ప్రజాతంత్ర) విజయవంతంగా నిర్వహించారు. కేవలం వారి పేరుతోనే కాకుండా సుమారు పాతిక కలం పేర్లతో వారెన్నో రచనలు చేశారు. కన్నడం నుంచి పది, పన్నెండు నవలలు, కథా సంకలనాలు అనువదించారు. హిందీ, ఇంగ్లీషు నుంచి సుమారు ముప్పై గ్రంథాలు అనువదించారు. ఇంగ్లీషు నుంచి వంద వ్యాసాల దాకా అనువదించి, పేరు లేకుండా ముద్రణకిచ్చారు. దాదాపు వెయ్యి గ్రంథాలను సమీక్షించారు. సంస్కృతంలోను వంద దాకా వ్యాసాలు, కవితలు వ్రాశారు.

పరిశోధన పట్ల ఎంతో ప్రీతిగల రామచంద్రంలో సంయమనం కూడా ఎక్కువే. వారు తెలుగు సాహిత్యంలో వెలువడిన దాదాపు వెయ్యి గ్రంథాలు సమీక్షించి ఉంటారు. అయితే ఈ సమీక్షల కారణంగా రామచంద్ర వ్యక్తిగతంగా నష్టపోయింది ఎంతో ఉంది. ఆంధ్రప్రభలో తొలుదొలుత రామచంద్ర చేసిన "తెలుగు భాషా చరిత్ర" సమీక్షను దాని రచయిత ఆచార్య గంటి సోమయాజి జీవితాంతం గుర్తుపెట్టుకుని కక్ష పెంచుకున్నారు. ఎందుచేతంటే విశ్వవిద్యాలయంలో తెలుగు ఎటిమలాజికల్ డిక్షనరీ ప్రారంభించినప్పుడు ఆ ప్రాజెక్టులోకి రామచంద్రను తీసుకోవడానికి గంటి సోమయాజి అంగీకరించలేదు.

అలాగే తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వం నమూనా సంచికపై చేసిన సమీక్ష, దాని సంపాదకులు గిడుగు సీతాపతికి కోపం తెప్పించింది. తత్ఫలితంగా ఆ విజ్ఞాన సర్వస్వంలో గిడుగు సీతాపతి బతికున్నంతకాలం విజ్ఞాన సర్వస్వంలో రామచంద్ర కనీసం ఒక వ్యాసం కూడా వ్రాయడానికి అవకాశమివ్వలేదు. ఈ శ్రేణిలో మరో ఒకటి రెండు కూడా ఉన్నాయి.

ఇంత చేసినా, తన జీవితకాలంలో రెండు పొరపాట్లు చేశాననేవారు. ఒకటి డాక్టర్ రఘువీర వద్ద ప్రపంచ భాషా నిఘంటు నిర్మాణానికి సదవకాశం వచ్చినా పోగొట్టుకోవడం. రెండు : తాను తొలుదొలుత చేరిన డెయిలీ టెలిగ్రాఫ్ అనే ఇంగ్లీషు దినపత్రికలోనే కొనసాగక వెళ్ళిపోవడం. అక్కడే ఉండి ఉంటే విశ్వవిఖ్యాతుణ్ణి అయ్యేవాడినని బాధపడేవారు. డాక్టర్ రఘువీర ప్రపంచ భాషా నిఘంటువు నిర్మాణానికి పూనుకున్న మహాపండితుడు. రామచంద్రను తనతో చేరి పనిచేయమని ఆహ్వానించారు. 30 రూపాయల నెల జీతం ఇస్తానన్నారు. కాని 50 రూపాయలు ఇవ్వమని రామచంద్రకోరారు. బేరం కుదరలేదు. అట్లాగే ఇంకొక విద్వాంసుడు విశ్వబంధు శాస్త్రి, విశ్వేశ్వరానంద పరిశోధనాలయాన్ని స్థాపించి వేద విషయ పరిశోధన జరిపేవారు. ఆయన ఆహ్వానాన్ని కూడా రామచంద్ర ఆమోదించలేదు.

1944కు ముందు మహాత్మాగాంధీ దర్శనం చేసుకుని ఆయన ప్రభావానికిలోనై సత్యాగ్రహం చేశారు. చెరసాలపాలయ్యారు. అనంతర కాలంలో కళాశాల

బహిష్కరించి తెగిన గాలిపటంలా తిరుగుతూ దొరికిన ఉద్యోగం చేశారు. కొంతకాలం సైన్యంలో హవల్దారుగా పనిచేసి వచ్చారు. ఓరియంటల్ కాలేజీలో, తంజావూర్ సరస్వతీ మహల్‌లో, లాహోర్ ఓరియంట్‌లో మాన్యుస్క్రిప్ట లైబ్రరీలు వివిధ ఉద్యోగాలు చేశారు. కొంతకాలం సంస్కృత శిరోమణి చదివారు. ఆయుర్వేద కళాశాలలోను చేరారు. చివరికి తెలుగు సంస్కృతాలలో విద్వాన్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. హిందీ ప్రభాకర పూర్తిచేశారు. ఇతర భాషలలో డిగ్రీలు లేకపోయినా వారి పాండిత్యానికి కొదువలేదు.

దేశమంతా తిరుగుతూ ఏవోవో చిల్లర మల్లర ఉద్యోగాలు చేస్తున్న తరుణంలో రఘురాజ్‌సింగ్ అనే ఉత్తర ప్రదేశ్ వాసి రామచంద్రకు మిత్రుడయ్యాడు. మనం కలప వ్యాపారం చేద్దాం. మీరు వర్కింగ్ పార్టనర్. నేను పెట్టుబడి పెడతానన్నారు. తను హిమాలయ ప్రాంతానికి వెళ్ళి చెట్లు నరికించి గండకీనదిలో పడదోయిస్తే అవి అక్కడ నుంచి గంగ ద్వారా కాన్పూరు చేరుతాయి. అక్కడ ఉండి వాటిని మన సిబ్బందితో గట్టుకు లాగించుకుని వ్రాసుకోవాలి. రెండేండ్లలో రెండు మేడలు కట్టవచ్చునన్నాడట. తనకు మేడలపై మోజులేకపోయినా సద్యస్సమస్య భోజనానికి ఢోకా లేదనుకుని సరేనన్నారు. ఇద్దరూ కాన్పూరు వెళ్ళారు. అతడు పక్కనే ఉన్న స్వగ్రామానికి వెళ్ళి వస్తానన్నాడు. నెలరోజులు రామచంద్ర కాన్పూరులో కాచుకూచున్నారు. కాని ఆయన రాలేదు. విధిలేక కొన్ని ఏవో పనులు చేశారు. చివరికి “డెయిలీ టెలిగ్రాఫ్” అనే ఇంగ్లీషు దినపత్రికలో చేరారు. దానికి అప్పుడు వెంకటరామన్ సంపాదకులు. అందులో తొలుత రిపోర్టరుగా రామచంద్ర రాయల్ సాంకృత్యాయన్ ప్రసంగం వార్తగా వ్రాశారు. దాన్ని అక్కడక్కడ సవరించి ఎంతగానో ప్రోత్సహించారు. ఇక్కడ స్థిరంగా ఉండి పనిచేస్తే గొప్ప సంపాదకుణ్ణి చేస్తానని అభయమిచ్చారు. ఇంతకు ముందు ఇలాంటి మాటలు విన్నవే అనుకుని కొంతకాలానికి దాన్ని వదిలేశారు. ఒకవేళ అందులోనే ఉంటే ఇంగ్లీషు జర్నలిజంలో గొప్పవాణ్ణి అయి ఉండేవాణ్ణేమో! అని రామచంద్ర తన తెలుగు రచనలకు తగిన గుర్తింపురాని సందర్భాలలో బాధపడేవారు.

వారు "డెలీటెలిగ్రాఫ్' తర్వాత బుక్కపట్నం రామానుజాచార్యులు సంపాదకత్వంలో ఆనాటి "దక్కన్ క్రానికల్" దినపత్రిక యాజమాన్యం ప్రారంభించిన "తెలంగాణా"లో, పిదప సుప్రసిద్ధ రచయిత అడవి బాపిరాజు సంపాదకత్వంలో వెలువడిన "మీజాన్"లో పనిచేశారు. 1947లో "ఆంధ్రప్రభ" దిన పత్రికలో చేరి ఆదివారం అనుబంధం చూశారు. సంస్కృతానికి సంబంధించిన అంశాల్లో నార్ల వెంకటేశ్వరరావుకు ప్రధాన సలహాదారుగా ఉన్నారు. నార్లవారితో అభిప్రాయ భేదాలు వచ్చి 'ఆంధ్రపత్రిక'లో సహాయ సంపాదకుడుగా, వారి సాహిత్య పత్రిక "భారతి" ఇన్‌ఛార్జ్ ఎడిటర్‌గా పదమూడేళ్ళు పనిచేశారు. మళ్లీ "ఆంధ్రప్రభ" సచిత వారపత్రికలో కొంతకాలం ఉన్నారు. తిరిగి "ఆంధ్రపత్రిక"లో చేరి అక్కడే ఉద్యోగ విరమణ చేశారు. అనంతరకాలంలో "ఆంధ్రభూమి"లో పనిచేశారు. పలు పత్రికలలో వివిధ శీర్షికలు నిర్వహించారు.

వీరి పరిశోధనాత్మక రచనలలో పేర్కొనదగినవి "హిందువుల పండుగలు-పర్వాలు", "తెలుగు పత్రికల సాహిత్య సేవ", మూడు వాఙ్మయ శిఖరాలు, అహంభో అభివాదయే, బృహదారణ్యకం, మనవి మాటలు, బుద్ధుణ్ణి బళ్ళోవేశారులాంటివి. అనువాదాల్లో లలితవిస్తరం, అవధాన కల్పలత చెప్పుకోదగినవి.

ఆంగ్లం నుంచి వీరు తెనిగించిన "గాంధీ జీస్ ఎమ్‌స్సరీ" అంటే వీరికి ఎంతో ఇష్టమైందనేవారు. శంభు ప్రసాద్ కోరిక మేరకు సుధీర్ ఘోష్ రచించిన ఈ నవలను వారు అనువదించి ఆంధ్రపత్రికలో ప్రచురించారు. ఘోష్ గొప్ప మేధావి. స్వాతంత్ర్యానంతరం లండన్‌లో తొలి భారత హైకమీషనర్ కావలసినవాడు. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ కృష్ణమీనన్‌కు ఆపదవి ఇవ్వడానికి చేసిన కుట్ర, ఘోష్‌కు జరిగిన అన్యాయం మొదలైన రాజకీయాల రహస్యాలు చాలా రంజకంగా ఉంటాయి దీంట్లో. ఘోష్‌కు అన్యాయం చేసిన నెహ్రూ, చైనా భారతదేశంపై దండెత్తే వేళకు ఘోష్‌ను బతిమాలి అమెరికాకు పంపాడు. అమెరికన్ నౌకాదళాన్ని చైనా వైపు తరలించేట్టు చేయడంలో ఘోష్ అద్భుతపాత్ర, ప్రపంచ సంగ్రామం చెలరేగుతుందనే శంకతో చైనా వెనుతగ్గడంలాంటి వాస్తవాలు మనోరంజకంగా వ్రాశారు.

ఇలాంటి గ్రంథాలను మరెన్నో వ్రాసిన రామచంద్ర మౌలికమైన నాగలాపురం - దాని పరిసరాలు గురించి కూడా పలుమార్లు చెప్పేవారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడు తెలుగువారికి చాలా అన్యాయం జరిగిందనేవారు. బళ్ళారి, తిరుత్తణిపోవడం, దక్షిణార్కాట్, చెంగల్పట్టు, తుమేకూరు, బెంగుళూరు, సేలం జిల్లాలోని తెలుగు ప్రాంతాలు రాకపోవడం దురదృష్టకరం అనేవారు. కన్నీళ్ళ తుడుపుగా తిరుత్తణికిమారు నాగలాపురం తాలూకా చిత్తూరు జిల్లాకు చేరింది. దీనిలో పెద్ద దేవాలయం ఉంది అని ఆ కథ చెప్పేవారు. అధిష్ఠాన దేవత వేద నారాయణస్వామి. అసంపూర్ణమైన మహోన్నత గోపురాలతో, శిల్ప సంపదతో అలరారుతున్న ఆ దేవాలయాన్ని కృష్ణదేవరాయల తమిళ సచివులలో ఒకరు కృష్ణమ నాయకుడు కృష్ణరాయల తల్లి నాగలాంబపేర నిర్మించాడు. ఇతడు ఇరు సమయ విళక్కం మొదలైన తమిళ వేదాంత గ్రంథాలు రచించిన పండితుడు. ఈ దేవాలయంలో శిల్ప విశేషం ఏడాదిలో ఒకరోజు ఉదయ సూర్యకిరణాలు మూల విరాట్టు పాదాలపై పడడం.

ఈ దేవాలయం గురించి కొంత ప్రచారం కావాలని అప్పటి రాష్ట్రమంత్రి రామలింగరాజు శంభుప్రసాద్‌ను కోరారు. ఆయన తిరుమల రామచంద్రను ఈ పనికి పురమాయించారు. ఆర్టిస్ట్ ఫొటోగ్రాఫర్ - దశిక రామలింగేశ్వరరావుతో పాటు రామచంద్ర అక్కడికి వెళ్ళి వారం రోజులు వివిధ విషయాలు సేకరించి, జనశ్రుతులూ విని, ఆంధ్రపత్రికలో ధారవాహికగా వ్యాసాలు, అద్భుతశిల్ప చిత్రాలతో ప్రచురించారు. దానిని తర్వాత పుస్తకరూపంగా ముద్రించారు.

నరసా నాయకుడు దక్షిణ దేశాన్ని జయించి తిరిగి వస్తూ దారిలో నాగలాపురం వద్ద దండు విడుస్తాడు ఆయనకు సేదదీర్చడానికి ఆ మండలాధికారి నాగమ్మను పంపుతాడు. ఆమె నరసానాయకుని క్రమంగా దేవేరి అవుతుంది. ఈ వివరాలున్న శాసనం దక్షిణభారత శాసన సంపుటిలో దొరికిందట. ఈ శాసనం మన చరిత్రకారుల మన్నన ఎందుకు పొందలేదో! రామచంద్ర ఈ శాసనంతోనే తొలివ్యాసం ప్రారంభించారు. ఈ పరిశోధన చరిత్రకారుల మన్నన పొందింది.

లలితవిస్తరం మహాయాన బౌద్ధ సంప్రదాయానుసారమైన బుద్ధుని చరిత్ర. భారతదేశంలోనే ఇది మొట్ట మొదటి లౌకిక వచనమనీ, క్రీస్తుకు ముందు మూడు దశాబ్దాలనాడు రచించిందని రామచంద్ర అభిప్రాయం. మల్లంపల్లి సోమశేఖరశర్మ మొదలైనవారు లలితవిస్తరాన్ని ప్రస్తావిస్తూ దీనిలో విపుల సంగతి ఉందని, క్రీడల సంగతి ఉందని అనేవారు. దీనికి రాజేంద్రలాల్ మైత్రా కథా సంగ్రహం ఆంగ్లంలో ఉందిగాని, యథా మూలానువాదం ఏ భాషలోను లేదు. రామచంద్ర, ప్రముఖ విద్వాంసులు బలుసు వెంకట రమణయ్య కలిసి దీనిని మక్కిక్కి అనువదించారు. మొదట ఇది 1962లో ఆంధ్రప్రభ ఆదివారం సారస్వతానుబంధంలో ధారావాహికంగా ప్రచురితమై పుస్తకరూపం పొందింది.

అనువాదం చేసే పద్ధతిలో ముఖ్యంగా తెనుగు తోబుట్టువుల అనువాదంలో రామచంద్ర మక్కికి మక్కివాది. అంటే తెలుగు నుడికారం విడనాడి యథామూలమని కాదు. పఠనీయత ఉండాలి. మూలానుసారిగాను ఉండాలి. సంక్షేపీకరణం, సారాంశకథనం ఆయనకు ఒప్పదు. ఉదాహరణకు ఒక సన్నివేశం. రామచంద్ర దక్షిణభారత పుస్తక సంస్థ వారికి కొన్ని కన్నడానువాదాలు చేశారు. వాటిలో ఒక కథలో ఒక ఆఫీసరు కోపంతో ఆఫీసులో ప్రవేశించే భార్య కరాఘాతాలు తప్పించుకొనడానికి పెద్ద ఫైలును తలమీద పెట్టుకుంటాడు. అతడు దానిని టీకాచార్యులు హయగ్రీవుని కోసం శనగల పూర్ణం పళ్లెం నెత్తిమీద పెట్టుకున్నట్టు అని రచయిత వర్ణించారు.

వ్యాసుని బ్రహ్మ సూత్రాలకు ద్వైత మతానుసారంగా మధ్వాచార్యులవారు భాష్యం వ్రాశారు. దానికి అణుభాష్యమని పేరు. దానికి జయతీర్థుల వారు టీకవ్రాశారు. కనుక ఆయనకు టీకాచార్యులని పేరు. అది కూడా కఠినమని శ్రీపాదరాయలనే విద్వాంసులు మరొక వ్యాఖ్య వ్రాశారు. శ్రీపాద రాయలకు హయగ్రీవుడు ప్రత్యక్షమని ఐతిహ్యం. శ్రీపాదరాయలు ఉడికించిన సెనగలు బెల్లం పళ్ళెంలో పెట్టుకుని తలమీద మోసుకుని, గుదిగాళ్ళతో కూర్చుంటే హయగ్రీవుడు అశ్వరూపంలో వచ్చి, తనముందు కాళ్ళు శ్రీపాదరాయల మోకాళ్ళపై పెట్టి ఈ బెల్లం శనగలు తినేవాడట. ఈ చిత్రం

ఏ ఉడిపి హోటలులోనైనా గోడకు వ్రేలాడుతూ ఉంటుంది. ఈయనకు కూడా టీకాచార్యులని పేరుంది. కొందరు దీనికి ఒప్పరు. టీకాచార్యులు పళ్ళెం నెత్తిమీద పెట్టుకున్నట్టు అనే ఉపమానం కన్నడంలో విద్యావంతులకు తెలిసిన సంప్రదాయం. రామచంద్ర ఆ విధంగానే వ్రాసి క్రింద అథస్సూచికలో వివరణ ఇచ్చారు.

ఆ సంస్థలో తెలుగు ఎడిటర్‌గా ఉన్న బొమ్మకంటి సింగరాచార్యులు దానిని తీసివేసి వీరభద్ర పళ్ళెంలాగా అని మార్చారు. ముద్రణ జరిగిన తర్వాత రామచంద్ర దాన్ని చూచి, అది సరికాదని వాదించారు. వీరభద్ర పళ్ళెం మార్పు బాగుంది. కాని ఈమార్పువల్ల తెలుగు పాఠకులకు ఒక కొత్త సంప్రదాయ జ్ఞానం అందలేదు. అందుకు నిరసనగా రామచంద్ర ఇకపై వారికి అనువాదం చేయడం మానివేశారు. అది రామచంద్ర తత్వం.

క్షేమేంద్రుని బ్రహ్కృత్కథామంజరి గురించి రామచంద్రకు స్పష్టమైన అభిప్రాయాలుండేవి. కథాసరిత్సాగర కారుడు, బృహత్కథా సంగ్రహకారుడు తమ పీఠికలలో బృహత్కథావతరణ గురించి వ్రాసిన కథలను వారు నమ్మేవారు కాదు. ప్రాకృతాన్ని శాసన భాషగా చేసిన శాతవాహనులు బృహత్కథాకారుణ్ణి అవమానించారనడం నమ్మదగింది కాదనేవారు. కాదంబరి వంటి తర్వాతి కథలు బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలలో కనిపించడం వల్ల కూడా వాళ్ళు చెప్పే బృహత్కథ ప్రాచీనత్వం కూడా శంకనీయమేననేవారు. దాక్షిణ్యాత్య జైన బౌద్ధులలో ప్రచారంలో వున్న ఉదయన కథకే పెరుంగదై అనే పేరుండేదని, దాని సంస్కృతీకరణమే బృహత్కథ అని కీర్తిశేషులు వేదం వెంకటరాయశాస్త్రి మనుమడు చెప్పేవారు. ఆ వాదమే సరైందని రామచంద్ర అనేవారు.

తెలుగులో చిత్రకళపై వ్రాయాలంటే తగిన పదజాలం దొరకడం లేదని అందుచేత ఒక లలితకళా నిఘంటువు అవసరమని చేసిన ప్రతిపాదన అప్పటి లలితకళా అకాడమీ ఆమోదం పొంది తిరుమల రామచంద్ర, చీమకుర్తి శేషగిరిరావు, వజ్ఝ శ్రీనివాసశర్మలకు ఆపని అప్పగించారు. ఆంగ్లంలో వెలువడిన లలితకళా నిఘంటువులు ఆధారంగా ఆంగ్లాంధ్ర నిఘంటు భాగం వారు సిద్ధపరిచారు. ఈలోగ

అకాడెమీలన్నీ తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమయ్యాయి. అప్పుడు విశ్వవిద్యాలయం కేవలం ఆంగ్లాంధ్ర భాగాన్ని మాత్రం ముద్రించింది. ఇంకా ఆంధ్రాంగ్ల భాగం ముద్రించవలసివుంది.

ఈ లలిత కళా పదాలు సిద్ధపరచడంలో నిర్దిష్టమైన పద్ధతిని అనుసరించారు. ఉదాహరణకు:

1. ఆంగ్ల పదాలకు ధ్వని సామ్యం ఉండి, శ్రవణ సుభగంగా ఉన్నప్పుడు ఆంగ్ల పదాలనే సంస్కృతీకరించడం – Aaron's Rod - ఆరణ దండం. పాశ్చాత్య శిల్పాల్లో కనిపించే ప్రలక్షణమిది (మోటిఫ్), Lavender - Colour- ల కేంద్రవర్ణం, లావేంద్ర వర్ణం. Kaolin – కయోలిని. Gelatin – జలాతిని Matrix మాతృక. Jacob - జాకాబు.

2. ఆంగ్లపదాల అర్థాలు గ్రహించి, తదనుగుణంగా సంస్కృతం, తెలుగు పదాలు సృష్టించడం. Distemper – కలలం, జిగురురంగు, ఈ రంగును కోడిగుడ్డుసొనతో చేస్తారు. కలలమంటే గట్టిపడని పిండం. సొనకు దగ్గరిది. Fresco - సద్యస్కం, ఆర్ద్రభిత్తిచిత్రం, Mural- అక్లిన్నచిత్రం, గుద్యచిత్రం.

3. ఇది వరకు వాడిన మాటలతో పాటు వారికి ఉచితమని తోచినవాటిని ఇవ్వడం. Abstract Act - వివక్తకళ, సారాంశకళ, నైరూప్యకళ అనే పర్యాయాలున్నాయి. వీటిలో నైరూప్యకళ సరైంది కాదు. ఈకళలో రూపరహితత్వం – నైరూప్యం లేదు. కనుక విక్త సారంశ అనే మాట ఇచ్చారు. Etching – సూచీ చిత్రణ, దంశన ప్రక్రియ. Mosaic R చిత్రాస్తరం, మొజాయిక్ హైదరాబాద్‌లో తాపీపనివారు దాన్ని చీటా అంటారు.

4. కొత్తమాటల కల్పన Art Gallary - కళా శ్రేణిక.

5. ఉన్నవాటినే స్వీకరించడం. Galu's Blue – గానీయ నీలిమ. ఇదివరకు ప్రచారంలో ఉన్నవాటినే స్వీకరించడం. Acid ఆమ్లం. Alkaline క్షీరద్యుతికం. Amber అంబరి, తృణమణి.

జాకోబీయ, ఆక్రిలీయ అనే తద్ధితాలు శ్రవణరమ్యంగా ఉంటాయని వాడారు.

Cross R కురాబర్ట్ డినోబిలీ క్రూశ అనే పర్యాయపదం ఇచ్చాడు. ఇది సంస్కృత నిఘంటువులకు ఎక్కంది. దీని వ్యుత్పత్తి ఏమిటో తెలియదు. దీనిని, దీనితోపాటు సిలువ అనే వాడక పదాన్ని ఇచ్చారు.

Academy - పరిషత్తు, అకాడమీ, కళాకారులను ప్రోత్సహించే సంస్థ 16వ శతాబ్దంలో ఇటలీలో తొలిసారిగా ఏర్పడింది. దీని చరిత్ర వివరించారు.

Alcohol Colours అనే పదానికి హలాహల వర్ణాలు అని పర్యాయం ఇవ్వవచ్చు. కాని హాలా పదానికి సురా అనే అర్థం హలాహలానికి సురా అనే అర్థం ఉన్నా, విషమనే అర్థం కూడా స్ఫురిస్తుంది. కనుక మద్యసార వర్ణాలు అని అన్నారు.

ఇలాంటి నిఘంటు నిర్మాణం దేశంలోనే తొలి ప్రయత్నం కాబట్టి గొప్పపనే.

వీరి రచనల గురించి ఇంకా ఎన్నని చెప్పను. ఏదో కొత్త విషయం లేకుండా ఏ రచన చేయలేదు. ఇవ్వాళ పత్రికలు వాడుతున్న భాషలో ఏది సరైన పదమో, ఏది తప్పో వివరిస్తూ వ్రాసిన "పలుకుబడి"కి కూడా ఇంతవరకు గ్రంథరూపం ఇవ్వలేదు. తిరుమల రామచంద్ర శత జయంతి సంవత్సరాన్ని పురస్కరించైనా, ఈ యేడాది, గ్రంథాలుగా రాని వారి రచనలన్నీ వెలుగు చూస్తాయని ఆశిద్దాం.

( ఇందులోని కొన్ని భాగాలు "ఆంధ్రజ్యోతి" 16-6-2013 సంచికలో ప్రచురించారు)

***

# మరో మరుపురాని మనీషి - తిరుమల రామచంద్ర

– డా॥ అక్కిరాజు రమాపతిరావు

**సు**మారు నలభై ఏళ్లనాడు 'ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక'లో (1962-64)లో శ్రీ తిరుమల రామచంద్ర ఈ రచనలను ఒక ప్రత్యేక శీర్షికగా నిర్వహించారు. అప్పట్లో ఆంధ్రదేశంలో సుప్రసిద్ధులైన కవి పండితులు, కళాసిద్ధులు, చరిత్రవేత్తలు, తమ తమ ప్రజ్ఞా ప్రాభవక్షేత్రాలలో పరిగణనీయులు అయిన మనీషులను స్వయంగా కలిసి వారితో ఇష్టాగోష్ఠి ప్రసంగాలు నిర్వహించి వారి జీవిత విశేషాలను, వారి సార్థక జీవన సారస్వత సాంస్కృతిక లలిత కళామూర్తిమత్త్వాన్ని వివరించడమే ఆయన ఆశించిన లక్ష్యం.

ఎవరి గురించి వారు చెప్పుకోవడంలో కొన్ని సంకోచాలున్నా రామచంద్రగారి వంటి నిత్య నిరంతర సారస్వత మనీషులు సమీపించినప్పుడు, ఆత్మావలోకనం చేసుకోవడానికే ఎవరైనా ఉత్కంఠ చూపుతారు. ఆయన వారి మూర్తిమత్త్వాన్ని సమర్థంగా చక్కగా రూపొందించగలరని వారి విశ్వాసం. అందువల్ల ఈ మహనీయుల వ్యక్తిత్వ నిరూపణంలో ఒక నిండుదనం, ఒక కమనీయత రామచంద్రగారు నిరూపణం చేశారు. ఒక శతాబ్దంలో సాహిత్యమూర్తులుగా, సామాజిక స్ఫూర్తులుగా విలసిల్లిన సుమారు 30 మంది జీవన రేఖాచిత్రణం ఈ సంకలనంలో చోటు చేసుకున్నది.

ఈ సంకలనంలో కవులున్నారు. కళాకారులున్నారు, సాహిత్య జగత్ప్రసిద్ధ పండితులున్నారు. వ్యాకరణవేత్తలున్నారు. మహానటులున్నారు. చరిత్రవేత్తలున్నారు. సమాజ చైతన్యం సాధించిన మహిళలున్నారు. అందుకే వీరందరినీ మనీషులన్నారు

శ్రీరామచంద్ర. 'మనీషితాః సంతి గృహేషు దేవతాః' అని కాళిదాసు కూడా అన్నాడు కదా! దేవతలంటే ప్రకాశించేవారని అర్థం. వీరంతా తమ తమ రంగాలలో ప్రకాశించారు. వెలుగులు విస్తరింపజేశారు. కాబట్టి పూజనీయులని రామచంద్రగారి భావం.

అన్నిటికన్నా ఆకర్షణీయమైన అంశం ఏమంటే ఈ సంపుటంలో ఆ విశిష్ట వ్యక్తుల అపురూపమైన ఛాయా చిత్రాలున్నాయి. అది రామచంద్రగారూ, ఆయన వెంట ఛాయా చిత్రసంగ్రహణలో వీటిని రూపొందించి సేకరించిన శ్రీ నీలంరాజు మురళీధర్‌గారూ తెలుగు వారికి చేసిన మహోపకారం. మామూలుగా వృత్తి నిపుణుడైన ఫొటోగ్రాఫర్ తీసిన ఫొటోల మాదిరిగా కాకుండా ఈ మనీషుల పరా, పశ్యంతీ, అంతస్సత్వాలు కూడా ఫలకీకరించడంలో మురళీధర్‌గారు కృతకృత్యులైనారు. స్వీయ వైఖరిని చెప్పే ఛాయా చిత్రాలు తీయడం, అవి వారి ఇష్టులైనవారు చూడడం ఎక్కడైనా సంభవించేదే. అయితే వారి అంతరంగ బహిః ప్రతిఫలనం ఛాయా చిత్ర స్థితం చేయడం కష్టం. కష్టమే కాదు, అసాధ్యమైన పని. కాని శ్రీమురళీధర్ దానిని సాధించారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని, జాషువ శివశంకరస్వామి, కాశీకృష్ణాచార్య మహోదయులు, అద్దంకి, స్థానం, పులిపాటి, దీపాల, గుండూరావు హర్కారే వంటి మనీషులు ఫొటోలు ఈ సంపుటంలో తప్ప అటువంటి హావభావ విన్యాసాలతో మరెక్కడా లభించనివి. శ్రీరామచంద్రగారి వాచకం కూడా అనితరసాధ్యంగా ఈ రచనలో విన్యాసించింది.

20వ శతాబ్దం తెలుగు సాహిత్యంలో ఈ మనీషులు స్థిర ప్రతిష్ఠితులు. కాబట్టి వారిని గూర్చి తెలుసుకుంటే 20వ శతాబ్ది తెలుగు సాహిత్యపు తీరుతెన్నులు, వివిధ కళానిరూపణ పరిణామాలు స్థూలంగా తెలుసుకోవడానికి ఆస్కారముంది. ఈ శతాబ్ది కొత్తపాతల మేలుకలయికగా ఈ చరితార్థుల, ఈ కళాశీలుర, విద్వాంసుల ప్రజ్ఞా ప్రాభవాలు శ్రీ తిరుమల రామచంద్ర ఈ రచనలో ఆవిష్కరించారు. కోలవెన్ను రామకోటేశ్వరరావు వంటి ప్రథమశ్రేణి పత్రికా సంపాదకులు, కాశీ కృష్ణాచార్యుల

వంటి సంస్కృతాంధ్ర విద్వద్వతంసులు తమ జీవితకాల కృషిని శ్రీ రామచంద్రగారికి విశ్రుతపరచారు. తద్వారా తెలుగువారందరూ తెలుసుకొన్నారు.

ఇక వీరితో సముఖిగోష్ఠులను అక్షరమహితం చేసిన తిరుమల రామచంద్రగారు కూడా మరొక 'మరపురాని మనీషి' అనే చెప్పాల్సి వుంటుంది. ఆయన కవిగానో, నాటక రచయితగానో, విద్వద్విమర్శకుడిగానో, లలిత కళావిశారదుడి గానో, ప్రతిభాపూర్ణుడైన వాజ్మీగానో ప్రసిద్ధుడు కాకపోయినా, ఆయన ప్రతిభ బహుముఖీనమైనది. విశిష్టమైనది. 20వ శతాబ్ది సాహిత్య వ్రతులలో రామచంద్రగారి వంటి వైవిధ్యభరితమైన జీవితం గడిపినవారు మరొకరులేరు. అర్ధశతాబ్ది కాలం తెలుగు పత్రికారంగంలో తనదైన ప్రత్యేక ప్రతిపత్తిని నిరూపించుకున్నవారూ లేరు. సహస్రాధికంగా వ్యాసాలు, సమీక్షలు, ప్రాస్తావిక రచనలూ చేసినవారూ మరొకరులేరు. పరిశోధన ప్రవణులున్నూ మరిలేరు.

శ్రీరామచంద్రగారిది సాహిత్య విషయికంగా, సామాజిక వికాస కృషి విషయికంగా చాలా ఉదారమైన విశాలమైన దృక్పథం. నిస్వార్థమైన అంకితభావంతో సాహిత్య విజ్ఞాన విస్తరణకు ఆయన కృషి చేశారు. అనేక విషయ సంగ్రాహకులే కాకుండా ఆయన గొప్ప సమన్వయశీలి. ఏది రాసినా మౌలికమెన ఆలోచనతో, అన్వేషణతో దానిని నాయన నిర్వహించారు. 1913లో జన్మించి 1997లో పరమపదించారు. ఈ ఎనభై నాలుగు సంవత్సరాల జీవితయాత్రలో నిజంగా నిత్య నిరంతర యాత్రికుడే ఆయన అనిపిస్తుంది. 20వ శతాబ్దిలో తమదైన ప్రత్యేక వ్యక్తిత్వముద్రను అటు ఉత్తర భారతంలోకాని ఇటు దక్షిణ భారతంలోకాని వెలార్చిన మహనీయులను శ్రీరామచంద్ర పరిచయం చేసుకున్న వారిని తెలుగువారిలో మరెవరూ పరిచయం చేసుకొని ఉండరు. వారితో కలసి పనిచేసీ ఉండరు. అన్నిటికన్నా ఆసక్తికరమైన విషయం స్వాతంత్ర్యోద్యమంలో ఆయన జైలు జీవితం గడిపారు. తిరుపతిలో, నెల్లూరులో, మద్రాసులో సంస్కృత విద్యాసంస్థలలో చదువుకొన్న శ్రీ తిరుమల రామచంద్ర స్వాతంత్ర్యోద్యమంలో విప్లవ సంఘాలలో

పనిచేయడం వింతలో వింత. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఆయన ఎంత ఆసక్తితో పనిచేశారో తిరువళిక్కేణి రామవిలాస హోటల్‌లోనూ అంతటి ఆసక్తితోనూ పనిచేశారు. సైన్యంలో చేరి హవల్దారు ఉద్యోగవిధులనూ నిర్వహించారు. సౌశీల్యం, సౌజన్యం, సౌమనస్యం మూర్తీభవించిన వ్యక్తిత్వం వారిది. వారు రచించిన గ్రంథాలన్నీ ప్రత్యేక శ్రేణికి, విశిష్ట వర్గానికి చెందినవి. మన లిపి - పుట్టు పూర్వోత్తరాలు, గాథా సప్తశతిలో తెలుగు పదాలు, నుడి - నానుడి, లలిత విస్తరం, అవధాన కల్పలత ఆయన పేరును చిరస్మరణీయం చేస్తాయి. హిందువుల పండుగల వంటి గ్రంథాన్ని విశ్వనాథవారు ఎంతగానో ప్రశంసించారు. 'మరెవరికీ మరేమీ చెప్పడానికి మిగలకుండా మీరీ గ్రంథాన్ని రచించా'రని అంటూ విశ్వనాథవారు మెచ్చుకున్నారని ప్రాస్తావికంగా చెపుతూ రామచంద్రగారు ఎంతో సంతోషిస్తూ ఉండేవారు.

ఇటీవల రామచంద్రగారి స్వీయ చరిత్ర 'హంపీ నుంచి హరప్పా దాకా' అజో-విభొ-కందాళం వారు ప్రకటించారు. రెండు సంవత్సరాలలో రెండు ముద్రణలు పొంది తెలుగువారి ఆదరాభిమానాలకు పాత్రం కావడమే రామచంద్రగారి మనీషతకు తార్కాణం.

***

## తిరుమల రామచంద్ర కలం పేర్లు

తిరుమల రామచంద్రకు దాదాపు పాతిక దాకా కలం పేర్లు ఉండేవి. వాటిలో కొన్ని: చంద్ర, రా.చ., తా.రా., రా.తి, తిరుమల, తాతాచార్య, ఆచార్య, సంచారి, బాటసారి, పర్యాటక్, పరిశీలక్, పరిశోధక్, ప్రయాణికుడు. ఇన్ని కలం పేర్లు దేశంలో బహుశా మరే రచయితకు లేవు.

# పండిత పాత్రికేయ తరంలో కొసమెరుపు రామచంద్ర

- ఎబికె ప్రసాద్

**సు**మారు ఏడుదశాబ్దాలపాటు ప్రాకృత, సంస్కృతాంధ్ర సారస్వతాలలో మహా పండితుడుగా, ద్రావిడ భాషల అధ్యయనంలో అలుపెరుగని అకలంక పరిశోధకుడిగా వెలుగొంది తెలుగు సాహితీ చరిత్రలో కీర్తి శిఖరాలందుకుని తెలుగు జాతికే నిండుదనం చేకూర్చిపెట్టిన తిరుమల రామచంద్ర అస్తమయం తీరని వెలితిగా భావిస్తున్నాం. పిట్టకొంచెం కూతఘనం అన్న నానుడి రామచంద్రకు వర్తించినంతగా మరొకరికి నప్పదేమో! భాషాసాహిత్యాలపట్ల, పరిశోధనపట్ల, నూతనాంశాలను తెలుసుకోవడంలో ఆఖరి శ్వాసవరకూ ఆయన చూపిన శ్రద్ధాసక్తులు తపన, ఆబ వర్ణనాతీతం. లోకానుభవం, సత్యాన్వేషణ రామచంద్రను భాషా విషయాలలో ప్రజాబంధువుగా మలిచిపెట్టాయి. భవభూతి అభివర్ణించిన రసాలలో ఒక్కకరుణ రసమే ఆస్వాదనీయమైతే అది రామచంద్రలో ఆపాదమస్తకం నిండివుందనే చెప్పాలి; నిరాడంబరత, నిండుమనస్సు, ఓరిమి ఆయన వ్యక్తిత్వ వికాసానికి మెరుగులు దిద్దిన మురుగులు! ప్రజలపట్ల ముఖ్యంగా సామాన్య ప్రజలపట్ల రామచంద్ర ఆర్ద్రత అనుకంపనా నేటి యువతరం రచయితలకు ఆదర్శం కావాలి; ఆయనలో రచనా నిబద్ధతేకాదు, తీసుకున్న అంశాన్ని "జీర్ణమంగే సుభాషితం" అనుకోకుండా నలుగురికీ పంచిపెట్టే నిమగ్నత కూడా ఉంది. దిలీపుని వ్యక్తిత్వాన్ని గురించి వర్ణిస్తూ కాళిదాసు "అప ధ్వష్యోభిగమ్యం" అనలేదూ! అలాగే రామచంద్ర క్షణం కూడా విశ్రమించని నిత్య పరిశోధకుడూ, మేధాకార్మిక జీవి, ప్రచారానికి ఏనాడూ అంగలార్చినవాడు కాదు, ప్రలోభాలకు లోనై గజ్జెకట్టినవాడూ కాదు.

వేటూరి ప్రభాకరశాస్త్రి వద్ద శిష్యరికమూ, ఆయనతో సాంగత్యమూ రామచంద్రుని దిద్దితీర్చి, మనిషినేగాక మనసునీ గుణశీలిగా మార్చాయి. సంస్కృతంలో సాహిత్య శిరోమణిగా, తెలుగు సంస్కృతాలలో విద్వాన్‌గా, హిందీలో 'ప్రభాకర'గా పట్టాలు పుచ్చుకున్నా రామచంద్ర సాధారణ పండితులతోనేగాక తన పొందుగోరి వచ్చిన సామాన్య విద్యార్థులతో, భాషాపరిశోధకులతో నిత్యం చెట్టపట్టాలు కట్టి తిరిగిన వ్యక్తి. పండిత సంపాదకుల తరంలో ఆయన కొసమెరుపు. భాషావేశంలో, భావశబలతలో, భావోజ్జ్వలతలో వ్యావహారిక భాషను కడు రమ్యంగా పాఠకులకం దించిన లేఖిని ఆయనిది. మూడు దినపత్రికలకూ, "భారతి", "పరిశోధన" మాసపత్రికలకూ రామచంద్ర ఒక్కచేతి మీదుగా చేసిన సేవలు అనితర సాధ్యాలు. అసూయాద్వేషాలకు అతీతుడు; కనుకనే ఆయన కలం నుంచి నాడు జాలువారిన "మరపురాని మనీషులు"గాని "అహంభో అభివాదయే" రచనగానీ విభిన్నరంగాలకు చెందిన వ్యక్తులకు సంబంధించిన వైయక్తిక దృష్టితో రాసిన మహనీయుల లేఖినీ చిత్రాలుగా వాసికెక్కాయి. పత్రికలతో సాంగత్యం, సంపాదక బాధ్యతలూ రామచంద్రుని పాఠకులకు సన్నిహితం చేసింది. ఆయన "తెలుగు వెలుగులూ" అంతే. కట్టమంచి రామలింగారెడ్డి వద్ద అంతే వాసిత్వం (శిష్యరికం)తో స్వయం ప్రకాశానికి మరింత వన్నెతెచ్చుకున్న రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గురించి రాసినా, ప్రాచ్య కవితా కోకిల సరోజినీదేవి గురించి చెప్పినా, పుట్టపర్తి కృషిని పరామర్శించినా, తమిళనాడులో కొడిగట్టుతూన్న తెలుగు దీపానికి నూనెపోసి వత్తులు దిద్ది తెలుగు నిలిపిన సాధు వరదరాజం గురించి ప్రస్తావించినా, పుచ్చలపల్లి సుందరయ్య పార్లమెంటరీ జీవితాన్ని చిత్రీకరించినా, సంగీలక్ష్మి సుబ్బలక్ష్మి, విశ్వనాథ, క్రొవ్విడి లింగరాజు, బూర్గుల రామకృష్ణరావు, నాదస్వర సుధాలహరి గాలిపర్తి పిచ్చిహరి, వాయులీన విద్యతో ఆనందలోకాలు చూపించిన ద్వారం గురించి వివరించినా – రామచంద్ర కళ్ళముందు బొమ్మకట్టవలసిందే! సాహిత్య, సంగీత, నాటక, సాంస్కృతిక రంగాల గురించి రామచంద్రకు తెలియని అంశాలు తక్కువ. ఆయని "మనలిపి : పుట్టుపూర్వోత్తరాలు" రచన భాషా చరిత్రకు తలమానికం. స్వాతంత్ర్య సమర యోధుడుగా రామచంద్రుని

